"భూమి-గాలి, సూర్యుడు, నీరువలె భగవంతు డిచ్చిన ఉచిత బహుమతి. ఎవ్వరూదానిపై యాజమాన్యం కాని దానిపై హక్కుగాని కలిగియుండరాదు. భూమిలేని వారినుండి నేను అడిగేది న్యాయంకన్నా ఎక్కువ ఏమీలేదు........"

"మిమ్మల్ని ప్రేమతో దోచుకోడానికి వచ్చాను. మీకు నలుగురు పుత్రులుంటే, నన్ను ఐదవ వానిగా భావించి నా భాగంనాకు ఇవ్వండి........"

—వినోబా

# భూదాన గంగోత్రి

## పోచంపల్లి

౧

రచయిత :

ముద్దుకూరి కృష్ణారావు



నాగార్జున విజ్ఞాన సమితి

H. O. ఇన్నీసుపేట,
రాజమండ్రి
ఆంధ్ర

B. O. చిదానందమఠ్
సుల్తాన్ బజార్
హైదరాబాద్

## శ్రీ కేశవరావుగారి పరిచయ వాక్యాలు

శ్రీ కృష్ణారావుగారు తెలంగాణా ప్రథమ యాత్రలో శ్రీ వినోబాజీతో వుండిరి. రెండవ యాత్రలోకూడా వుంటున్నారు. ఇందువల్ల వారు వ్రాసిన విషయాలకు విలువవుంటుంది. భూదాన యజ్ఞము నందుగల తత్వము, భావములు, నవీన చైతన్యముతో కూడుకొన్న నూతన పురుషార్థానికి చెందినవి. కాబట్టి ఇట్టి మహత్తర విషయములో వ్రాసే ప్రతిపుస్తకము చదువదగినదై యుండును. ప్రభుత్వ ఉద్యోగములో వుండికూడా యువకులైన వీరి ఉత్సాహము ప్రశంసనీయము.

(Sd) ఉమ్మెత్తాల కేశవరావు,
హైద్రాబాద్ భూదానయజ్ఞ సంచాలక్

1956 జనవరి 30 న ఆచార్య వినోబాగారు భూదానయజ్ఞ జన్మస్థలమైన పోచంపల్లి గ్రామాన్ని రెండవసారి దర్శించుచున్నారు. ఆరోజున భూదాన యజ్ఞ ఆందోళనకు పూర్తి స్వరూప మివ్వడానికి ఆయన తలంచుచున్నారు.

ఈ పుస్తకములో భూదానయజ్ఞము ఏవిధంగా ఆరంభ మయిందో దానిని చిత్రించడానికి నా సాయశక్తులా ప్రయత్నంచేసాను.

ఈ పుస్తకాన్ని ప్రచురించిన నాగార్జున విజ్ఞాన సమితి, రాజమండ్రి వారికి నాకృతజ్ఞతను తెలుపుచున్నాను.

రచయిత

# భూదానగంగోత్రి
## పోచంపల్లి



భూదానయజ్ఞాన్ని ఆచార్య వినోబాభావేగారు హైద్రాబాదు రాష్ట్రం, నల్గొండజిల్లా, భువనగిరి తాలూకాలోవున్న పోచంపల్లి గ్రామంలో ప్రారంభించారు. పోచంపల్లి గ్రామం హైద్రాబాదుపట్టణానికి 25 మైళ్ళ దూరంలోవుంది. 1951లో ప్రారంభించ బడిన ఈ మహాయజ్ఞం శాఖోప శాఖలుగా వ్యాపించి వ్యాప్తి చెందినది.

పోచంపల్లి గ్రామంలో 'పోచమ్మ అమ్మవారు' కలరనే ఒక నమ్మకం ఆగ్రామస్తులకువుంది. అందుచేతనే ఆగ్రామానికి 'పోచంపల్లి' అనిపేరు వచ్చింది. గత రెండుమూడు దశాబ్దముల వరకూ ఈగ్రామాన్ని 'గాజుల పోచంపల్లి' అనే పేరుతో వ్యవహరించేవారు, ఎందుచేతనంటే ఒకప్పుడు ఈ గ్రామంలో ఒక బ్రహ్మాండమైన గాజుల పరిశ్రమ వుండేదట. అధికారుల ప్రోత్సాహంలేక అది మూలబడినదని గ్రామస్థుల వాదం.

పోచంపల్లి గ్రామంలో దాదాపు 700 ఇండ్లు వున్నాయి. 400 పైగా జనాభావుంది. అన్ని జాతులవారు ఎటువంటి భేదభావములులేకుండా కలసిమెలసి తమపనులు చేసుకుంటూ

వుంటారు. రెండు, మూడు కిరాణాకొట్లు, కోమట్లకు చెందినవి వున్నాయి. ఒక పెద్ద చేనేతవస్త్రముల విక్రయశాల వుంది. పోచంపల్లిలో వివిధరకముల చీరెలు నేయబడుతాయి. ఆచీరెలను భారతదేశంలోని పట్టణాలలోనే కాక, వివిధ పాశ్చాత్య దేశములలో కూడా విక్రయిస్తూంటారు.

*     *     *     *

1951 జనవరి నెల ప్రారంభంలో హైద్రాబాదులో వున్న ప్రముఖ నిర్మాణ కార్యకర్త, శివరాంపల్లి సర్వోదయ కేంద్రము వ్యవస్థాపకులైన శ్రీ రామకిషన్ ధూత్ గారు ఏప్రిల్ నెలలో జరిగే సర్వోదయ సమ్మేళనమును హైద్రాబాదు నగరానికి సమీపముననున్న శివరాంపల్లి గ్రామంలో జరిపించాలని సంకల్పించారు. ఆసమ్మేళనమునకు అధ్యక్షత వహించుటకు ఆచార్య వినోబాభావేగారిని కోరాలనికూడా ఆయన నిశ్చయించుకున్నారు. ఇతర సర్వోదయ కార్యకర్తల సహకార సానుభూతులతో, ముఖ్యంగా శ్రీ జ్ఞానకుమారి, శ్రీ హరిశ్చంద్ర హెడాల ప్రోత్సాహంతో పవునార్ ఆశ్రమానికి శ్రీరామకిషన్ ధూత్ గారు బయల్దేరారు (పవునార్ ఆశ్రమము వార్ధాకు 6 మైళ్ళదూరంలో వుంది) వినోబాజీ అంగీకారము పొందడానికి.

ఆరోజుల్లో వినోబాగారు తన ఆశ్రమానికి దగ్గరగానున్న ఒక ఎకరము భూమిలో స్వంతసేద్యం చేస్తూ కాంచనముక్తి

పొందడానికి ప్రయత్నం చేస్తూండేవారు. డబ్బు లేకుండా కూడా మానవజన్మ సాధ్యమని ఆయన ప్రపంచానికి తన ఈ ప్రయత్న సాఫల్యంవల్ల చాటారు. ఆయనతోబాటు ఇతర అనుచరు లుండేవారు. వారుకూడా కాయకష్టం వినోబాగారి వలెనేచేసి తమకు కావలసిన వాటిని పండించుకొనేవారు. ఆశ్రమ నియమాలను వినోబాగారివలెనే వారుకూడా పాటించేవారు.

హైద్రాబాదులో సర్వోదయ కార్యకర్తల వివిధకార్య క్రమాలనుగూర్చి వివరంగా వినోబాజీకు తెలిపిన తర్వాత తాను జరుగబోయే సర్వోదయ సమ్మేళనమును శివరాంపల్లిలో జరుపుటకు నిశ్చయించినట్లు కూడా ఆయనకు శ్రీరామ కిషన్ ధూత్ తెలియజేసారు. ఆ తర్వాత సమ్మేళనమునకు 'తామే' (వినోబాజీ) అధ్యక్షత వహించి, శివరాంపల్లి సర్వోదయ కేంద్రాన్ని పావనంచేయమని శ్రీధూత్ ఆయనను కోరారు. శివరాంపల్లి గ్రామంలోవున్న ఈ సర్వోదయ కేంద్రములో వివిధ కుటీర, గ్రామీణ పరిశ్రమలున్నాయి. ఈ కేంద్రము పూర్తిగా సర్వోదయ సిద్ధాంతాలపై నడుస్తూంది.

* * * *

ఆచార్య వినోబాగారు వెంటనే 'నేను రాజాలను' అని శ్రీధూత్ కు చెప్పివేసారు. తను ప్రస్తుతం చేస్తున్నపని అతి ప్రాముఖ్యము కలదని పేర్కొంటూ, తను హైద్రాబాదుకు

బయట్లోరడం అసంభవమని ఆయన అన్నారు. శ్రీధూత్ వినోబాజీ చెప్పినవన్నీ విన్నతర్వాతకూడా నిరాశ చెందలేదు. ఆయనను హైద్రాబాదుకు తీసుకు వెళ్ళడానికి చేయవలసిన ప్రయత్నాలు మానలేదు.

శ్రీరామకిషన్ ధూత్ యొక్క కోరికనుగూర్చి కొన్ని రోజులు వినోబాజీ శ్రద్ధగా ఆలోచించారు. శ్రీధూత్‌ను నిరాకరించుట ఆయనకు మనసొప్పలేదు. అదేవిధంగా తాను తలపెట్టినపనిని అసంపూర్తిగా విడిచిరావడానికి కూడా ఆయనకు చేతకాలేదు. కాని, ఒకనిర్ణయం తీసుకొన్నారు. హైద్రాబాదు వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు. కాని, రైలు మీదగాని, ఏయితర వాహనం మీదగాని, పోవడానికి ఆయన అంగీకరించలేదు. వార్ధానుంచి హైద్రాబాదుకుగల 350 మైళ్ళదూరాన్ని కాలినడకన యాత్రచేయడానికి ఆయననిర్ణయం తీసుకున్నారు.

శ్రీరామకిషన్‌ధూత్, ఇతర సర్వోదయ కార్యకర్తలు వినోబాజీ నిర్ణయంపట్ల హర్షంప్రకటించారు. వారి సంతోషానికి పట్టపగ్గాలు లేకుండా పోయింది. వినోబాజీకు ఘనమైన స్వాగత మిచ్చుటకున్నూ, సర్వోదయ సమ్మేళనమును బ్రహ్మాండముగా జరుపుటకున్నూ ఏర్పాట్లుచేయ నారంభించినారు.

* * *

1947 ఆగస్టు15న భారత దేశమునకు స్వాతంత్ర్యము లభించింది. స్వాతంత్రమునకు ముందున్న రాష్ట్రాధిపతులు చాలా మంది భారతయూనియన్‌లో జేరారు. కాని హైదాబాదు నిజాం నవాబు, కొన్ని మతశక్తుల ప్రాబల్యమునకు లోనయి భారత దేశములో జేరకుండా స్వాతంత్ర సిద్ధితర్వాత వచ్చిన మార్పులను నిజాంనవాబుకు నచ్చచెప్పడానికి భారతప్రభుత్వము కూడా చాలా ప్రయత్నాలుచేసింది. నిజాంనవాబు వాటిని ఖాతరుచేయకుండా భారత ప్రభుత్వముతో చేసుకొన్న Standstill agreement ని ధిక్కరించాడు. ఈసమయంలో రాష్ట్రంలోవున్న మతశక్తులు, ఇతర అసాంఘిక శక్తులు తమ కార్యకలాపాలను నిర్విఘ్నంగా కొనసాగించడ మారంభించినాయి. గృహదహనాలు, దోపిడీలు, ఖూనీలు రోజు రోజుకు పెరుగసాగాయి. ప్రజల జీవితములకు అపాయస్థితి ఏర్పడింది. నిజాంనవాబుకూడా తన అధికారము కొనసాగించ లేకపోయాడు. భారతప్రభుత్వానికి పోలీసుచర్య జరపడంతప్ప వేరే గత్యంతరము లేకపోయింది. 1948 సెప్టెంబరు 18న రాష్ట్ర పరిపాలన భారతప్రభుత్వము తన అధీనములోనికి తీసుకొని మిలిటరీ ప్రభుత్వాన్ని ఏర్పరచింది.

*　　*　　*　　*

పోలీసుచర్యకు పూర్వము అసాంఘిక శక్తులుకూడా తమ కార్యకలాపాలను నిర్విఘ్నంగా కొనసాగించారు. కాని వారి

కార్యకలాపాలన్నీ తెలంగాణా జిల్లాలోనే ఎక్కువగాజరిగేవి. ముఖ్యంగా నల్గొండ, వరంగల్, కరీంనగరం జిల్లాల పరిస్థితి పూర్తిగా చెడిపోయింది. మిలిటరీ ప్రభుత్వముకూడా శక్తి వంచన లేకుండా పనిచేసి అసాంఘిక శక్తులను రూపుమాపుట లో సఫలత పొందినది. తెలంగాణా( హైద్రాబాదు రాష్ట్రం లోని తెలుగుమాట్లాడే జిల్లాలైన నల్గొండ, కరీంనగరం, వరంగల్, మహబూబ్ నగరం, హైద్రాబాదు, మెదకు, ఖమ్మంమెట్టు, నిజామాబాదు, ఆదిలాబాదులను తెలంగాణా అని అంటారు.) రైతాంగంయొక్క పరిస్థితి దినదినం క్షీణించ సాగింది. గ్రామాల్లోఉండే రైతులు, పెద్దపెద్దభూస్వాములు, తాలూకా, జిల్లాల కేంద్రాలకు వెళ్ళి నివసించడం మొదలు పెట్టారు. వ్యవసాయం తారుమారైంది. ఈపరిస్థితులను అదు పులోకి తీసుకురావడానికి రహస్యజీవితము గడుపుతున్న కమ్యూనిస్టు నాయకులను పట్టుకోడానికి చేసేప్రయత్నాలను ప్రభుత్వం ద్విగుణీకృతం చేసింది.

* * * *

పవునార్ ఆశ్రమమునుంచి హైద్రాబాదుకు 1951మార్చి 8 న వినోబాజీ, ఇతర అనుచరులతో కాలినడకన బయల్దే రారు. దారిలో మహిళాశ్రమం వచ్చినప్పుడు, ఆశ్రమ నివా సులైన మహిళలు శాంతియుతంగా వినోబాజీకు స్వాగతం చెప్పారు. శ్రీమతి జమన్‌లాల్ బజాజ్ ఇతరులతో ఆయన ముచ్చటించి యాత్ర కొనసాగించారు.

వినోబాజీవెంట శ్రీమతి మదాలస అగర్వాల్ (అ. భా. కాంగ్రెసు ప్రధానకార్యదర్శి శ్రీ శ్రీమన్నారాయణ అగర్వాల్ భార్య), శ్రీ దామోదరదాస్ ముందడ, (వినోబాజీ ఆంతరంగిక కార్యదర్శి) శ్రీ భాలపాన్సె, శ్రీ బిహారిలాల్, ప్రభృతులు వార్ధానుంచి బయల్దేరారు. నిజామాబాదు, ఆదిలాబాదు జిల్లాలనుంచి వస్తూ 1951 ఏప్రిల్ 7 వ తేదీ శివరాంపల్లి చేరుకున్నారు. అక్కడ రాష్ట్రసర్వోదయ కార్యకర్తలు, ఇతరనిర్మాణ కార్యకర్తలు, ఆయనకు ఘనమైన స్వాగతం ఇచ్చారు.

సర్వోదయ సమ్మేళనమునకు వచ్చినతర్వాతనే తెలంగాణా యొక్క కల్లోలపరిస్థితి ఆయనకు తెలిసింది. ఆయన చాలా బాధపడ్డారు. తెలంగాణా ప్రజలబాధలు నివారించడానికి వారికి శాంతి సందేశము ఇవ్వడానికి తెలంగాణా జిల్లాలలో కాలినడక పర్యటించడానికి ఆయన పూనుకున్నారు. ఆయన 1951 ఏప్రిల్ 16 న (రామనవమి) తెలంగాణాయాత్ర ఆరంభించారు.

* * * *

హాయత్ నగరం, బాటసింగారము గ్రామాలలో మకాం చేసిన తర్వాత ఏప్రిల్ 18 న వినోబాజీ, వారి వెంటవచ్చిన బృందము పోచంపల్లిగ్రామం చేరుకున్నారు. గ్రామస్థులు,

ఇతర గ్రామాలవారుకూడా వినోబాజీకి బ్రహ్మాండమైన స్వాగతసన్మానాలు చేసారు. ప్రతి ఇంటికీ మామిడాకు తోరణాలు కట్టబడి, ఆదినం ఒక పెద్ద వేడుక దినంగా జరుపబడింది.

తెలంగాణాయాత్రలో ఆయన వెంట శ్రీయుతులు కోదండ రామరెడ్డి, అచ్యుతభాయి దేశపాండే, ఉమ్మెత్తల కేశవ రావు, శ్రీమతి సందెము లక్ష్మీబాయమ్మగార్లు వున్నారు. శ్రీయుతులు రామకిషన్ ధూత్, బద్రీచంద్ చౌదరీ, వర కాంతము గోపాలరెడ్డి ప్రభృతులు ఆయనను తరచు కలుస్తూ వుండేవారు.

* * *

గ్రామంలో ముస్లింల 'మజ్లిస్' (సభాస్థలం) అయ్యే చోటులో శ్రీవినోబాగారు నివాసం ఏర్పరచుకొన్నారు. దానినే 'అఫూర్ ఖానా' అని అంటారు. ఆగ్రామానికి చెందిన 80 హరిజనులు వినోబాజీ నివాసస్థలానికివచ్చి తమకు భూమి లేదనిన్నీ, తిండిగింజలు లేకుండా అలమటిస్తున్నామనిన్నీ ఆయనకు నివేదించుకున్నారు. తాము ప్రభుత్వము వారికి నచ్చచెప్పితే మాకు భూములు ఇయ్యగలరు అని కూడా హరిజనులు వినోబాజీతో అన్నారు. ప్రభుత్వానికి చెప్పడానికి సాధ్యం కాదని పేర్కొంటూ ఈవిషయాన్ని ప్రార్థనసభలో చెప్పెదనని కూడా ఆయన వారికిచెప్పారు.

గ్రామస్థులు మొత్తం, ఇతర పల్లెల ప్రజలు ప్రార్థన సమయానికి వేలాది సంఖ్యలో పాల్గొన్నారు. "అఘూర్ ఖానా" కు ముందరవున్న ఖాళీస్థలంలో ప్రార్థన జరుపబడింది. ప్రార్థనానంతర సభలో హరిజనులు తనకు చెప్పుకున్న విషయాన్ని గూర్చి ప్రస్తావిస్తూ, "ఒక వేళ ప్రభుత్వమువారు భూమి ఇవ్వకుండా వుండడమో, ఇవ్వడానికి జాగుచేయడమో జరుగవచ్చును. అటువంటి సమయంలో గ్రామస్థులే వారికేదైనాం సహాయం చేయకూడదా?" అని అన్నారు. ఎవరైనా భూహీనులకు భూమి ఇవ్వడానికి సిద్ధంగా వున్నారేమో తెలుసుకోడానికి ఆయన ఉత్సాహం చూపారు. ఆయన అడుగడమే తడవుగా శ్రీ వెదిరె రామచంద్రారెడ్డి అనే భూస్వామి, "మీకు నేను భూమిఇస్తాను. భూమిహీనులకు ఇవ్వడానికి వంద ఎకరముల భూమి నేను దానంగాఇస్తాను." అనిఅన్నారు. అందరూకూడా ఆశ్చర్య చకితులైనారు. తను అన్న మాటలను తిరిగిచెప్పమని వినోబాజీ రామచంద్రారెడ్డిగారిని కోరారు. తను అన్నమాటలను ధృవపరుస్తూ, "నేను వందఎకరములు దానంగా ఇస్తాను. నామాటలమీద నమ్మకంలేకపోతే, ఇప్పుడే వ్రాసి ఇస్తాను." అని శ్రీ రామచంద్రారెడ్డి తిరిగి చెప్పారు. ఆవిధంగా ఇన్ని శాఖోపశాఖలుగా వ్యాప్తి చెందిన "భూదాన గంగోత్రి" పోచంపల్లి గ్రామంలో పుట్టింది. అన్ని గ్రామాలకు పోచంపల్లి ఆదర్శగ్రామ మయింది.

భారత దేశములోవున్న అసంఖ్యాకప్రజానీకానికి పోచం పల్లి ఆశలకు పుట్టినిల్లయింది. ప్రపంచ దృష్టిఅంతా నేడు ఈగ్రామంమీద వుంది. "భూదానయజ్ఞం" ఇక్కడ ప్రారంభింపబడి, ప్రపంచ సమస్యను సాధించడానకి కూడా ఒక భారతీయ మార్గముందని ఋజువుచేసింది.

భారతదేశంలో ఉన్నంత అహింసాదృష్టి, శాంతి కొరకు భారతదేశం చేసినన్ని ప్రయోగాలు మరేదేశం చేయనేలేదని చరిత్ర తెల్పుతుంది. పరాక్రమంలో కూడా భారతదేశం తక్కువకాదు. అయినప్పటికి భారతదేశం ఎప్పుడూ యితర దేశాలపై దండెత్తలేదు.

హింసవల్ల మానవుని మనస్సులో మార్పేమీ జరగదు. ప్రజారాజ్యంలో ప్రతివ్యక్తికీ అధికారం ఉంటుంది. ఈరోజున భారతదేశంలో నడుస్తున్నది ప్రజాస్వామ్యమే కాని ప్రజారాజ్యంకాదు..... ...

—వినోబా

# మా రానున్న ప్రచురణలు

1. సత్ పురుషుని సాన్నిధ్యంలో — దుద్దుకూరి కృష్ణారావు
2. వినోబా ప్రవచనములు — సేకరణ - పి. వెంకటాచార్య.
3 భూదాన గంగోత్రి (ఇంగ్లీషు) — దుద్దుకూరి కృష్ణారావు
4. హైద్రాబాదు రాష్ట్రంలో వినోబాజీ ఉపన్యాసాలు (ఇంగ్లీషు, తెలుగు)

# అమ్మకమునకు సిద్ధముగానున్నవి

| | |
|---|---|
| 1. భూదానయజ్ఞ సింహావలోకనము | 0—3—0 |
| 2. పురుషోత్తమ ప్రార్థన | 0—1—0 |
| 3. వినోబాజీ చిత్రములు (చిత్రములు 10 కల ఒక సెట్టు) | 0—8—0 |
| 4. ఆంధ్రలో వినోబాజీ ఉపన్యాసములు | 1—0—0 |




నాగార్జున విజ్ఞాన సమితి,

H. O. ఇన్నీసుపేట
రాజమండ్రి
(ఆంధ్ర)

B. O. చిదానందమఠ్
సుల్తాన్ బజార్
హైద్రాబాద్.